ప్రవర్తకుఁడైన ద్విపద రగడోదాహరణాద్యనేక దేశిసాహిత్య ప్రక్రియల నతిప్రీతి నాదరించిన సోమన రగడ ద్విపదలకే ప్రాధాన్యముగల యక్షగానమును గూడ నొక్కటైన రచించి దానినొక ప్రచార సాధనముగా వినియోగించుకొని యుండడా ? అసలు 15-16 శతాబ్దములకు ముందునాఁటి యక్షగానమొక సాహిత్య ప్రక్రియగాఁగాని, రూపక ప్రక్రియగాఁగాని రూపొందినట్లాధారములు గానరావు. అయితే అంతకుముందు మన యాంధ్రులకు మార్గనాటకమువంటి నాటకములు (క్రీడాభిరామము వినా) లేకపోవచ్చునుగాక. కాని యక్షగానమువలె దేశిసరణికిఁ జెందిన నాటకములు కొన్ని లేకపోలేదు. మనవలెనే పూర్వకాలమునఁ దమిళులు, కన్నడిగులు మొదలగు మరి కొందరికి మార్గనాటకములవంటి నాటకములు లేనట్లు తెలియవచ్చుట యబ్రము. కాని యాటవిక జాతులకే యాటపాటల యందాస్థ యున్నట్లు తెలియుచుండ నాగరక జాతులకు నాటక కళాభిరుచి యన్నది సహజముగదా. ఆ నాఁటి మనదేశి నాటకములే వీధి నాటకములను పేరఁ బ్రసిద్ధికెక్కినవి. అట వీధిలో నాడబడు నాటకములని యర్థము. (వీధియనగా నిటదశరూపక ప్రభేధముగాదు. నాటకశబ్దమిట రూపక సామాన్యవాచి) ఇది కన్నడిగల 'బయలాట', తమిళుల 'తెరుక్కూత్తు' అనువానికి సమానార్థకమైనది. పాల్కురికి సోమనాథునిపండితారాధ్య చరిత్రలోనే నాటకములు, బహురూపకములు, వెడ్డంగము, తోలుబొమ్మలాటలు మొదలగు రూపక ప్రక్రియలనేకము పేర్కొనబడినవి. జవనికలు, పాత్రల యాహార్యకము, ప్రదర్శన ప్రరోచక, అభినయభంగులు, సంగీతపు హంగు మొ॥ నాటకపు తంతు వివరింపబడినది. త్రిపురవిజయము, కామదహనము, అర్ధనారీశ్వరము, అంధక గంధగజాసురవధము, దక్షాధ్వరధ్వంసము, క్షీరసాగర మథనము, సిరియాళ చరిత్ర మొ॥ నాటి నాటకేతి వృత్తములును బేర్కొనబడినవి. ఇందలి కథలు కొన్ని పిదప కాలమున యక్షగాన వస్తువులు నైనవి.

ఇవికాక క్రీడాభిరామమున బేర్కొనబడిన మాచల్దేవి చరితనాటకము, విజయనగర ప్రభువు వీరనరసింహరాయల (క్రీ. శ. 1506–1509) కొలువులోఁ గూచిపూడి బ్రాహ్మణ భాగవతులు ప్రదర్శించినట్లు తెలియ వచ్చిన సంబేట గురవరాజు నాటకము, క్రీ. శ. 1514 నాఁటి కర్నూలు జిల్లా చెరువు బెళగళ్ళ శిలాశాసనము నందుఁబేర్కొన బడిన తాయికొండ నాటకము మొ॥ యక్షగానములుగా నీనాఁడు కొందరు పరిశోధకులచే భావింపబడుచున్నవి. కాని యట్లు భావించుటకుఁ దగిన యాధారమేమియు లేదు. అవి వీధి-తెర నాటకముల కోవకు జెందినవి మాత్రమేయై యుండును.

పూర్వము బహుళదా సంస్కృత సాహిత్య ప్రవీణులైన మన కవులు సంస్కృత నాటకముల వంటి నాటకములను దెనుగున సృజింపరైరి సరికదా ఆ నాటకములనే నాటకములుగా నాంధ్రీకరింపలేదు. కొన్నిటిని పద్య ప్రబంధములుగా మాత్రమే పరివర్తించిరి క్రీడాభిరామ మొక్కటి అందుల కపవాదము! ఆనాఁడు రాజాస్థానములందు సంస్కృత నాటకములు బ్రదర్శింప బడుచుండెడివనియు, జనస్థానములలో వీధినాటకములు, బహురూపములు మొదలగు తెర నాటకములును బ్రచారమందుండెననియు నూహింప వలసియున్నది కాలక్రమమున వాని ప్రభావము యక్షగానములపై గూడబడి యది యాకృష్టులైన శిష్టకవులు కొందరు తద్రచన చేపట్టగనే రూపకకళ కొంత సంతరించుకొని యొక విశిష్టప్రక్రియగా రూపొంది రాజ ప్రమోదములను సమపాళముగా జూరగొని వీధి నాటకమనియు బేరొందె దేశి సరళికి జెందిన నాటకములకెల్ల బ్రతినిధిగా నిలిచినది. మనకు నాటక కృతులు లేనిలోటు తీర్చినది. దీని ప్రభావము మూలముగనే మొన్న మొన్నటిదనుక గూడ మన కవులకు మార్గ నాటకములవంటి నాటకములు రచింపవలసిన యావశ్యకత కన్పింపక పోయి యుండవచ్చును.

పాల్కురికి సోమనాథుని నాటికే యక్ష నేపథ్యముల తోడి పాటగా నాటగా వెలసియుండునని యూహింప దగిన యక్షగానమున కాంధ్రమున నాప్రదర్శకులొక విశిష్ట జాతిగా నేర్పడిన పిదప కొంత కాలమునకు యక్షనేపథ్యములతోడి సంబంధము సడలి గానమునకే ప్రాధాన్యము హెచ్చియుండును. పదునైదవ శతాబ్దిలో భీమఖండోదాహరణమును బట్టి యది స్తోత్ర పాఠోపయోగియైన యొక ప్రత్యేకగాన శైలి యనియు క్రీడాభిరామోదాహరణము బట్టి యది జక్కుల పురంధ్రిచే నెక్కటిగా శ్రుతిలయాత్మక వాద్యోప సహితముగా రాగతాళమానస్థాయి గమక నిహితముగా గాథాఖ్యాన పురస్సరముగా బ్రయోగింపబడు చుండెడిదనియు తెలియు చున్నది. ఉదా. క్రీడాభిరామమున నా జక్కుల పురంధ్రి పాటతో అక్కల ('యక్షకన్యల') యాటయు వర్ణితమైయుండుట (క్రీ. రా. 136-137) నా గానము నృత్యానుకూలమైనదనియుఁ దెలియనగును. ఇంకను నానాఁటి దాని ప్రత్యేకత యెట్టిదనగా క్రీ. శ. 1408-1502 సం.ల నడుమనుండిన, సంకీర్తనాచార్యుడని ప్రఖ్యాతుడైన చినతిరుమలాచార్యుడు (1537 ప్రాంతము) సంకీర్తన లక్షణమగు సంస్కృత గ్రంథమును స్వపితామహ కృతమును స్వజనక వ్యాఖ్యాతమును (ఇదియులబ్ధము) దెనుగుజేయుచు దరువులు జక్కుల రేకు లేలలు, చందమామ పదములు మొదలగు వానిని మొదట బేర్కొనుచు బిదప కొన్నిటి లక్షణములు నిర్వచించి యక్షగాన పదములగూర్చి యిట్లు వ్రాక్కుచ్చెను.

"యక్షగాన పదంబులు నవ్విధమున
సముచితానేక విధ తాళ సంగతులను
నవరసాలంక్రియా సవర్ణంబులనుచు
నలరునని హరికీర్తనా చార్యుడనియె"

—సం.ల. 66వ పద్యము

అతడు దరువులు నేలలు మొదలగు పదములకు లక్షణమును చెప్పియుండెను. కాని వానితోపాటు మొదట జక్కులరేకుల పేరెత్తుకొనియు (చూ. 50వ పద్యము) ప్రత్యేకముగా నాపేర లక్షణము చెప్పియుండలేదు.

అందుచేతను యక్షగాన పదముల నేలాదులతోపాటు మొదట పేర్కొనకపోయినను నేలాలక్షణమువెంట వాని లక్షణమును చెప్పియుండుటను జూడ జక్కులరేకులన్నను యక్షగాన పదములన్నను నొక్కటేయని నూహించవచ్చును."యక్షగాన పదంబులు" అని బహువచనము వాడబడుటచే యక్షగానమనగా నేదోయొక్క గీతిచ్ఛందోఘటితమైనదనికాక పలువిధములైన పదములతోకూడినదని తెలియనగును. అవి తాళ బహుళములును, నవరసాలంకృతములునైనవని స్పష్టముగా జెప్పబడినది. పై విషయములనుబట్టి 15వ శతాబ్దిలో యక్షగానము కథావలంబనము, సముచితానేక విధతాళ సంగతములు, నవరసాలంక్రియాసవర్ణములునగు పదములును కలిగి కావ్య రచనోపయుక్త స్వరూపమును కల్గియున్నదని చెప్పనగును.

రచనా ప్రక్రియను బట్టి సాహిత్యమంతయు ముత్తెఅగులు--పద్యము, గద్యము, పదము-లేక గేయము. ఆ మూడింటి ప్రత్యేక ప్రయోగమువలనగాని సంకలన ప్రయోగమువలనగాని బహువిధ సాహిత్య ప్రక్రియలను సాధింపవచ్చును. తెలుగులో బదునాఅవ శతాబ్ది చివరిదాకా వెలసిన శిష్టవాఙ్మయ మెక్కువగా బద్యగద్య ఉభయాత్మకమైన చంపూధోరణిలో సాగిన పురాణములు, ప్రబంధములు, పద్య కేవలముగా నడచిన శతకములే. కాని అప్పటికే చాల కాలముగానే పల్లె యెల్లలలోనో పలుకుచున్న గేయ సరస్వతి శిష్ట కవులచే నుపేక్షింపబడినది. అయినను నిష్టపడిన శిష్టకవులే కొందఱు పద పద్యములకు నడిమి వాటముగా నడచునట్టి ప్రక్రియ నొకదానిని

స్వీకరించిరి. అదే ద్విపద. అట్లే యక్ష మార్గపద్ధతికి చెందిన కళికోత్కళికల రూపమున నవతరించిన పదకవితా ప్రభేదమగు రగడయును గలిసి వచ్చిన ఉదాహరణమును గూడ స్వీకరించిరి. ఈ ప్రక్రియలన్నింటికి నేకవాక్యత సంఘటింప గలట్టిది యక్షగానము. ఆ రహస్యము గ్రహించియే కాబోలు కాలక్రమమున వైవిధ్య ప్రవీణులైన మన కవులు కొందఱు తద్రచన చేపట్టిరి.

మనకిప్పటికి తెలిసినంతలో తెలుగున వెలసిన మొట్టమొదటి యక్షగాన రచన క్రీ॥ శ॥ 15వ శతాబ్ది యుత్తరార్ధమునకుండిన ప్రోలుగంటి చెన్నశౌరి సౌభరి చరితమే. అదియైన నతడు రచించినట్లు తెలిసినదే కాని గ్రంథము లభింపలేదు. అది జక్కులకథయని పేర్కొనబడినది. అది తాళ్ళపాక చినతిరుమలాచార్యుడు చెప్పిన యక్షగాన లక్షణమట్లు "నవరసాలంకృతముగ" నున్నదని పేర్కొనబడుట గమనింపదగియున్నది. కవి దానిని జక్కుల కొఱకు వ్రాసెనో, జక్కులవారి గానరూపకథాఖ్యాన పద్ధతినే మూసలగా రచించియుండుటచేత నా పేరు పెట్టియుండెనో, లేక యానాడు యక్షగాన సామాన్యముగా జక్కుల కథయను పర్యాయ వ్యవహారమున్నదో తెలియదు. సౌభరి చరితము భాగవత విష్ణు పురాణములందుగలదు కాని దానికి యక్ష పాత్రలతోగాని జక్కుల కులదేవతయగు కామేశ్వరితోగాని సంబంధములేదు. మనకీనా డుపలబ్ధమగు యక్షగానములన్నియు నట్టివే. చెన్నశౌరి కృతి యక్షగాన మని యూహించుటయే సమంజసమగును. 15వ శతాబ్దినాటి యక్షగాన రచన తీరెట్టిదో చూతమన్న నాకృతియు కృతిమాసిపోయినది. క్రీ. శ. 1500 సం. ప్రాంతమువాడగు వెల్లంకి తాతంభట్టు తన కవి చింతామణియను లక్షణ గ్రంథమున భాషాలక్షణాధికారమున "లక్ష్మీ కళ్యాణములోని రేకు"లను పేర "నీరజోదరు రాణి నీలవేణికిని" అను నుదాహరణమిచ్చెను. రేకులను రచనా విశేషము యక్షగానములందు

మాత్రమే కన్పట్టును. యక్షగాన పదములకు జక్కుల రేకులకు పేరున్నట్లు సంకీర్తన లక్షణమునుండి గ్రహింపనగునుగదా. అయితే అంతంభట్టు నుదాహరణము ద్విపద పాదము కాని యిది జంపెగతి గలది. ఆ ప్రక్కనున్న రేకను మాట కాదనరానిది. ఇది చిత్రకవి పెద్దన యక్షగానములందుండునని చెప్పిన "జంపెరేకు" లక్షణమునకు సన్నిహితముగానున్నది. పై లక్ష్మీ కల్యాణము యక్షగానమై యుండునని తలంపనగును. కాని యీ గ్రంథము కూడ లభింప లేదు. ఇది యత్కృతమను విషయము గూడ తెలిసినదికాదు. దీనిని బట్టి నాటి యక్షగానములందు రేకనునది యొక రచనాంగమని యూహింపనగును. దాని స్వరూపమెట్టిదో యెఱుగుట కాంధ్రమున యక్షగాన లక్షణముగూర్చి చెప్పుటకు గొంత ప్రయత్నము చేసిన వారిలో మొదటివాడగు చిత్రకవి పెద్దన (16వ శతాబ్ది పూర్వార్ధము) రచించిన లక్షణసార సంగ్రహమును పలుకరింపవలెను. అతడు నవవిధ రగడల లక్షణములను చెప్పి వెనువెంట యక్షగానముగూర్చి యిట్లెత్తుకొనినాడు:-

సీ॥ "వృషభగతి త్రిపుడరే కంఘ్రియుగమగుఁ
దుదనేడు లఘువులు తొలగజేయు
జంపె రేకునకు లక్షణము ద్విరదగతి
యగుగొన నొక లఘువందుమాన

రచ్చరేకగును దురగవల్గనముగతి
మరి యేకతాళి యీ మధురగతిని
అట తాళమున మాత్ర లంఘ్రికిర్వది నాల్గు
నాల్గిట విరతి పఢ్నాలుగింట

తే॥ నిలుచు నర్ధంపు నర్ధచంద్రికలు దీన
యక్షగానాది కృతులలో నార్యులిడిన
రగడ భేదంబు లివి యాను రమ్యచర్య
యవిత నిజదాస సముదాయ! యాంజనేయ"

ల.సా. సం. II-141.

ఇందు పేర్కొనబడిన త్రిపుటాదులు సంగీత ప్రపంచమున సూళాదితాళములుగా ప్రసిద్ధములు. మఱి "త్రిపుటరేకు" "జంపె రేకు" అనగా నవి త త్తత్తాళ ప్రధానములగు గీతములందేకైక చరణములు లేక దళములను విభాగముల వంటివై యుండును. అందలి యర్ధము లర్ధచంద్రికలు. "యక్షగానాది కృతులలో నార్యులిడిన రగడ భేదంబులివి" రగడ భేదములు కాని రచనా విశేషము లింక నెన్నిగలవో యానాటి యక్షగానములందని యెఱుగరాదు.

క్రీ. శ. 1450-1550 సం.ల నడుమ యక్షగాన లక్ష్య లక్షణములిట్లు లాక్షణిక పరిగణనమున కెక్కినవనగా నా ప్రాంతమున యక్షగాన రచన కొంత సాగినదనియే చెప్పవచ్చును.

ఈనాడు దొరికేవానిలో కవికాలం తెలినంతలో కందుకూరు రుద్రకవి సుగ్రీవ విజయమే ప్రాచీన తమమైనదిగా పరిగణింపబడు తోంది. అతడు పెద్దనకు ఒక్కింత అర్వాచీనుడు. అయితే చక్రపురి రాఘవార్యుని విప్రనారాయణ చరిత్రమనే యక్షగానాన్ని పెద్దనకు సమకాలీనమైన దానిగా అంటే ఇప్పటికి మనకు లభ్యమయ్యే వానిలో మొదటిదానిగా నేను గుర్తించి నాపరిశోధన నిబంధనలో దానినిగూర్చి వ్రాసియున్నాను. ఇది సుగ్రీవ విజయము రెండును కవులచే యక్షగానాలుగా పేర్కొనబడినవే. రెండింటిలోను రచనా సామ్యము స్పష్టముగా గుర్తించవచ్చును. రెండింటిలోను ఎత్తుగడ

అర్ధచంద్రికలలో దశావతార ప్రశంసాత్మకముగనే షష్ఠ్యంతాలు, గ్రంథాంతమున కర్తృత్వ ద్విపద, రచనలో ద్విపదకు జంపె, త్రిపుట మొ॥ తాళప్రధానమైన రేకులకు ప్రాచుర్యము, యెడనెడ సంధి ప్రయోజనాత్మకాలయిన చిన్న చిన్న వచనాలు, ఏలలు, అర్ధచంద్రికలు మొ॥ దేశీయ మధుర కవితా ఛందో విశేషములు, అతివిరళంగా పద్యములు ఉండుట చూడగా అదియే ప్రాచీన యక్షగాన రచనా పక్కియని యనిపిస్తుంది. చిత్రకవి పెద్దన యక్షగానాల్లో ఉపయోగింపబడు రగడ భేదాలను ఉదాహరిస్తూ ఏ రగడకు ఏ తాళము సరిపడునో అంతమాత్రమే చెప్పియున్నాడు. ఆంధ్రదేశంలో యక్షగాన రచన యించుమించు రెండు శతాబ్దముల కాలము ఆ ప్రాచీన ఫక్కిలోనే సాగినది. మధ్య మధ్య కంకంటి పాపరాజువంటి విదగ్ధులు కొందఱు మఱికొన్ని వేషాలు చేరుస్తూ వచ్చిరి. 1650 ప్రాంతపు అప్పకవి స్వయముగా యక్షగాన రచన చేసినవాడైనప్పటికిని దాని లక్షణ విషయమున మాత్రము పెద్దన నుడివిన విషయమునే పునశ్చరణ చేసెను. ఆ లక్షణం పరిపూర్ణమైనది కాకపోయినా వారిరువురు యక్షగాన రచనాంగములలో ముఖ్యమైన దానినిగూర్చి మాత్రమే చెప్పదలచినట్లు తోస్తుంది. అదే తాళము ప్రధానమైన రేకు. దాని మూల ప్రకృతి రగడ. దరువు అన్నది సంస్కృత "ధ్రువా" శబ్ద భావమై ఉండనోపును. నాట్యములోవలె యక్షగానములలోను యిది అనేక ప్రయోజనాలకు ఉపయోగపడుచున్నది. ఇది రాను రాను కర్ణాటక హిందూస్థానీ సంగీత పద్ధతులకు ప్రచారము కలిగిన రోజులలో కవుల నేర్పుకొలది రగడ వికృతి విడనాడి రాగ ప్రాధాన్యము వహించినది. అప్పకవి తర్వాత యక్షగానపు టూసుఎత్తుకొన్న లాక్షణికులు ఒకరిద్దరు లేకపోలేదు. కాని ఎవరు చెప్పినా ఆ లక్షణానికి అవ్యాప్తి పడుతూనే వచ్చినది. అసలు ఎలాంటి ఛందోబంధమునైనా తనలో ఇముడ్చుకోకలిగినటువంటిది యక్షగానము. కాలము గడచిన

కొలది దేశములో నాట్య సంగీతములకేర్పడిన వికాస వ్యాప్తులను బట్టి, ప్రయోక్తల అవకాశములనుబట్టి యక్షగానము అనేక వాలకములు వేసినది.

సుగ్రీవ విజయాన్ని పరిశీలిస్తే అది ప్రదర్శన సౌలభ్యముగల రచనయే అనిపించును. ఆనాడు యక్షగానములు ఏవిధముగా ప్రదర్శింపబడినవోగాని, అప్పటికే వీధినాటకాది ప్రదర్శనములలో ప్రతిష్ఠలనందుకొన్న భరతవిద్యా దురంధరులైన కూచిపూడి భాగవతులవలన పిదప కాలములోనే యక్షగాన ప్రదర్శనలకు ఒక నూతన చైతన్యము ప్రచారము కలిగినట్లు చెప్పవచ్చును. 17వ శతాబ్ది ఉత్తరార్ధములో వారి కులపతి శ్రీ సిద్ధేంద్రయోగియొక్క అపూర్వ సృష్టియైన కలాప ప్రదర్శన ప్రక్రియలో నృత్యప్రధానమైనది. కాని దాని రచనా ప్రక్రియకు యక్షగానమే మూదల కావచ్చును. ఆ కలాప ప్రభావము అర్వాచీన యక్షగానములమీద పడినది. కూచిపూడి భాగవతులు తెలుగునేల నాలుగు చెరగులను తిరుగుదురు. వారి ప్రదర్శనలు కారణముగా ఆయా గ్రామములందు మొలిచిన యక్షగాన మేళములవారు కూచిపూడి కత్తును ఎవరికి చేతనైనంత వారు అనుకరింపసాగిరి. ఏనాదులు, గొల్లలుకూడ యక్షగాన ప్రదర్శనలకు పూనుకొనిరి.

యక్షగానము ప్రదర్శనల కెక్కిన తరువాత కూడ చాల కాలము వరకు దాని ఆద్యప్రకృతియైన శ్రవ్యప్రయోజనము కూడ ప్రక్కప్రక్కల సాగుతూనే వచ్చినది. 19వ శతాబ్ది ఆంధ్ర దేశంలో యక్షగానము ఎక్కువగా పరిణతి చెందిన కాలము. యక్షగానములు కోకొల్లలుగా వెలిసినవి. ఇంచు మించు అన్ని నాటక నామముతో ప్రదర్శనలకు ఎక్కినవే. దేశములో పలుతావుల యక్షగాన మేళములు కూడ వెలిసినవి. యక్షగాన రచనలో ప్రదర్శనలో స్త్రీలును పాల్గొనజొచ్చిరి. బొమ్మలాటలకు పనికివచ్చునట్లు యక్షగానములు రచింప

బడినవి. కొందరు హరిదాసులు తమ హరికథలను యక్షగానములని వ్యవహరింపసాగిరి. క్రమేపి యక్షగానము మీద సంస్కృత రూపక ప్రభావము ఆధునిక రంగస్థల నాటక ప్రభావము పడసాగెను.

ఆంధ్రదేశపు యక్షగానములలో ముక్కాలు మువ్వీసము పౌరాణికేతివృత్తములే. కొందరు ప్రసిద్ధ చారిత్రిక పురుషుల జీవితోదంతములును యితివృత్తములైనవి. ముందు వాటి ప్రసిద్ధ ప్రబంధములు కొన్ని యక్షగానములుగా ప్రదర్శింపబడినది. కొన్ని యక్షగానముల రచనా ప్రక్రియలో కూడ ప్రబంధపు పలుకుబడి బాగుగా కనుపించుచున్నది. అసలు కొన్ని ప్రబంధములుగా వ్యవహరింపబడినవి.

ఆంధ్రదేశములో యక్షగాన రంగ విషయములో మాత్రము అభివృద్ధి కనుపట్టదు. అప్పటికప్పుడు ఏయూరి మొగనో ఏ దేవాలయము ముంగిటనో తటా తుటంగా నిర్మింపబడిన పందిరి క్రింద కటిక నేలయే రంగస్థలము. చుట్టూ కనుచూపుమేర అంతా ప్రేక్షాగారమే. కూచిపూడి భాగవతులు భరత విద్యాధురంధరులైనను ఊరూర సంచారము చేయువారు అగుటచే రంగస్థల విషయమున వారు శ్రద్ధవహించరేదు. అటు యిటు చెరి యొకనిచే పట్టుకొనబడిన తెల్లని గుడ్డయే తెర.. తెరకటు నిటు నూనె దివిటీలువుండును. తెరవెనుక హంగుదారులు వంత పాటకులు ఉందురు. హంగు - తిత్తి - మద్దెల, తాళపు చిప్పలు; తెర ముందు సూత్రధారుడు కన్పట్టును. అతడే ప్రదర్శన ప్రవర్తకుడు. ఆ పాత్రల ఆహార్య విషయములో కూచిపూడి వారి గడియాలు, సరంజామా పేరుపడినవి. ఆంధ్రదేశములో వారి ప్రదర్శన పద్ధతులే ఆదర్శప్రాయములైనా ఆ పద్ధతుల లగువు బిగువులు కడమ చోట్ల కానరావు. ఈనాడు ఆంధ్రదేశములో కుచ్ కుచ్‌గా కూచిపూడి వారివి తప్ప ఇతరత్రా యక్షగాన ప్రదర్శన ప్రతిష్ఠలు అడుగంటినవనే చెప్పవలసి యున్నది.

దక్షిణ దేశములో మొదట తంజావూరునందు యక్షగానమునకు రాజభోగము పట్టినది. నాడు యక్షగానానికి నాటక నామము ధ్రువ పడినది. నాటి కవులనేకులు అలాటి రచనలు చాల సాగించినారు. అవి కొలువు నట్టువ మేళముల వారిచేత ప్రదర్శింపబడెడివి. అందులో పద్యముల కంటె గద్యమునకే ప్రాధాన్యము పెరిగినది. ప్రాచీన మధుర కవితారీతుల ప్రాచుర్యము తగ్గి పదకవితలు కర్ణాటక సంగీత పక్కికలు ఎక్కువగా చోటు చేసికొనెను. సంధి వచనముల సంఖ్య తగ్గి పాత్రల సంవాద వచనముల సంఖ్య పెరుగ జొచ్చెను. అక్కడక్కడ రంగ ప్రయోగ సూచనలు కూడ నుండెను. మార్గ రూపక మర్యాదలు కూడ ఆదరింప బడినవి. తాత్కాలిక విషయములును ఇతివృత్తములైనవి. నాటి రాజాస్థానముల వైభవములు, ప్రజాజీవిత విశేషములు కూడ ముమ్మరముగా చిత్రింపబడినవి. తదుపరి తంజావూరు ప్రభువులైన మహారాష్ట్రులు కూడ మన తెలుగు యక్షగాన రచనా ప్రదర్శనముల యెడ అధికారము జూపి ఉండుట ముదావహము. శహాజీ ప్రభు వొక్కడే (1684-1712) ఇరువది గ్రంథములకు కర్త. అతని ఆస్థానాంధ్ర యక్షగాన కవులలో దర్భా గిరిరాజ గ్రేసరుడు. అతడు ఆరు యక్షగాన ప్రాయ రచనలు చేసెను. అందు ఒకటి రాజమోహన కురవంజి. కురవంజి తమిళ శబ్దము. అనగా కొరవ జాతి స్త్రీ యని యర్థము. అనగా ఎరుకత. తత్పాత్ర విశిష్టములైన యక్షగానములకే అది ఒక నామాంతరముగా కనిపించుచున్నది.

శహాజీ నాటి నుండి చిట్టచివర శివాజీ (1685-1855) వఱకు తంజావూరు మండలము, తత్పరిసరములలో యక్షగాన నాటక రచన ప్రదర్శనములు బాగుగా సాగినవి. సంస్కృత రూపక ప్రభావము యినుమడించి యక్షగానము ఉత్పత్తిలో దేశి యైనను పరిణామములో మార్గియైనదని చెప్పవలయును. నాడు యక్షగాన కవులకును, కృతు

లకును రాజాశ్రయము రంగభోగము విస్తరించినవి. రాజాశ్రితులు కాని యక్షగాన కవులలో ముఖ్యులు నారాయణతీర్థులు, త్యాగయ్య, మేళత్తూరు వెంకటరామశాస్త్రి. సుప్రసిద్ధమైన మేళత్తూరు భాగవత మేళ నాటక సంప్రదాయమునకు ఆద్య ప్రవర్తకుడు వెంకటరామ శాస్త్రియే.

18 వ శతాబ్దిలో మధుర పుదుకోట మైసూరు రాజాస్థానములలోను కడమ కన్నడ తమిళ ప్రాంతము లందును తెలుగు యక్షగానములు కొన్ని వెలసినవి. తమిళ కన్నడ యక్షగాన రచనలకు మార్గదర్శకాలైనవి.

తెలంగాణములో యక్షగానములు శతాధికములు కనబడు చున్నవి. రచన 18 వ శతాబ్దము నుండియే విరళముగా ప్రారంభమైనది. అవి మొదట ప్రదర్శనలో కంటె పారాయణమునందే ఎక్కువ ప్రచారమును పొందెను. 1780 నాటి శేషాచలపు ధర్మపురి రామాయణము 1834 నాటి ముద్దయ కవి మంథెన రామాయణము మొ॥ 19 శ. నుండి ప్రదర్శన కనువైన రచనలు ప్రారంభమైనవి. గోవర్ధనం నరసింహాచార్యులు, శేషభట్టరు కృష్ణమాచార్యులు, వట్టెము పాపకవి మొ॥ పండిత కవులు కూడ యక్షగాన రచన చేపట్టిరి. ఆత్మకూరు సంస్థానాధీశుల ప్రాపుల యక్షగానమునకు రాజాశ్రయము లభించినది. ఒక గొల్లకలాపము, ఒక కురవంజి (రూప్ ఖాను పేట రత్నమ్మ గారిది) కూడ వెలిసినవి. ఈ శతాబ్దిలో ఇప్పటి తెలంగాణాలో యక్షగాన రచన ప్రదర్శనములు సజీవములై ఉన్నవి. అందులో రచనా పాటవము ప్రాచీన ఫక్కి తక్కువై, నాటకీయత వస్తువైవిధ్యము ఎక్కువై ప్రజామోదాన్ని బాగుగా జూరగొనినవి.

## యక్షగాన ప్రయోగము

యక్షగాన రచనా ప్రక్రియ పరిణామ చరిత్రను గూర్చిన

ముందటి ప్రకరణమున బ్రసక్తాను ప్రసక్తముగ యక్షగాన ప్రయోగమును గూర్చియు గొన్ని విశేషములు తెలుపబడినవి. ప్రయోగ సూచనలు, ప్రయోగానుకూల ప్రక్రియయు గల కొన్ని య. గా. ల యుదంత ముదాహరింపబడినది. ఈ విషయమై ద్వితీయ భాగమున నే యే గ్రంథముల యందే యే విశేషములు గలవో తగు సూచన చేయబడినది. యక్షగానము మన దేశినాటక కోశమంతటికిని ప్రాతినిధ్యము వహించిన విశిష్ట ప్రక్రియ కావున దాని ప్రయోగ ఫక్కికను గూర్చి ప్రత్యేకముగ నీ ప్రకరణమునకు బ్రసక్తి కల్గినది.

యక్షగాన ప్రయోగము యొక్క ప్రాథమిక స్వరూపము గానరూప కథాఖ్యాన మను విషయము పూర్వోక్తము. ఆ పద్ధతి యొకవంక నప్పటప్పట సాగుచునే వచ్చినదని యూహింప నవకాశము కలదు. ఇందుల కుపబలకముగా తంజావూరు విజయ రాఘవ నాయకాస్థానకవియైన చెంగల్వ కాళకవి తనరాజగోపాల విలాసమున యక్షగానము నంతగా ప్రవర్తితమగు సంగీత గోష్ఠిగా సూచించిన వైనము, కన్నడదేశమున నీనాడు యక్షగానము 'తాళమద్దల' యను పేరుతో హరికథ వలె వాఖ్యానింపబడుటయు గలదను విషయము, మన హరిదాసులును తమ హరికథలను యక్షగానములని పేర్కొనిన విషయమును బూర్వోక్తములే. అది యొక పదకేళికగా బ్రదర్శింపబడుచుండిన దనుటకాధారములును (పరమానంద యతి, కంఠీరవ రాజుల రచనలు) బొమ్మలాటకు వెనుకపాటగా నుపయోగింపబడుచుండిన (ఇందులకు 19. శ. యక్షగానముల గురించియే తగిన యాధారము గలదు) దను విషయమును బూర్వోక్తమే. అది యెప్పటి నుండి యెట్లొక రూపక ప్రక్రియగా బరిణమించినది వివిధ దశలలో వివిధ ప్రదేశములలో దాని ప్రయోగము తీరెట్టిది అను విషయము కొంత పూర్వోక్తమయ్యెనను బ్రత్యేకముగనే తత్ప్రకరణోచితముగ విపులీకృతమై యిట బునశ్చరణ మొనర్పబడు చున్నది.

క్రీ. శ. 16 వ శతాబ్దము నుండి ఆంధ్రదేశమున యక్షగాన రచన మెక్కువగా సాగుచుండినది. అప్పటికే దొరసముద్రపునటులు, కూచిపూడి భాగవతులు, జంగాలు మొ॥ వారు వివిధములగు వీధి నాటకములు, తెరనాటకములు నూరూరప్రదర్శించుటలో ప్రసిద్ధులై యుండిరి. అట్లు దేశి నాటక కళకు విశేష ప్రచారము కలిగిన యా దినములలో వెలసిన యక్షగానము లందును నాటకోచితమైన రచన సాగినది. అందుల కానాటి సుగ్రీవ విజయాదులే తార్కాణలు. సుగ్రీవ విజయ మానాడు ప్రదర్శితమై యుండుననియే డా. నేల టూరి వెంకటరమణయ్యగారు మొ॥ పండితుల తలంపు. 'ఆ యా పాత్రముల పాటల తత్తద్వేషధారులువచ్చి పాడునట్లునుతక్కినసంధి వచనాదులు ఒకరిద్దరు సూత్రధారప్రాయులు పఠించునట్లును సుగ్రీవ విజయము వీధి యాటగా నాడబడుచుండెడి' దని కీ. శే. వేటూరి వారి వక్కాణ.

17 వ శ. ఉ. భా. ఆంధ్రదేశమున యక్షగానమునకు కూచి పూడి వారి కలాపముతో సంపర్కము కలిగినది. ఆ కలాప మాత్మా శ్రయ ఫక్కికము; నృత్య ప్రధానమునగు నొక యుపరూపక ప్రాయమైన దృశ్యప్రక్రియ. నాటినుండి యట్టి ప్రక్రియతో యక్ష గానములు ననేకము వెలసినవి. పారిజాతములను పేరవెలసిన వందులకు బరమోదాహరణములు.

18 వ శతాబ్ది యందాంధ్రదేశ యక్షగానములు కొన్నిటిపై మార్గనాటక ప్రభావము కొంత పొడసూపినది. అది 19 వ శ. ఉ. భా. న జిక్క పడినది. అది యట్లు చిక్కపడనున్న కాలముననే దానిపై నాధునిక రంగస్థల నాటక ప్రభావము కూడ పడి యక్షగాన మందు నాటకీయత యినుమడించినది.

ఆంధ్రదేశమున యక్షగాన రంగ విషయమున తగిన యభివృద్ధి కన్పట్టదు. అప్పటికప్పుడే యూరి మొగనో యే కోవెల మొగిలి

వాకిటనో, యే సంపన్న గృహస్థునింటి ముంగిటనో తాటా తూటముగా నిర్మింపబడిన కమ్మల పందిరిక్రింద గళ్ళాపు జల్లిన కటిక నేలయే దాని రంగస్థలం. కేవల మారుబయట గాక పందిరి క్రింద ప్రదర్శింప బడుటయే దాని యభివృద్ధి. దాని చుట్టును కనుచూపు మేర నంతయు ప్రేక్షకాగారమే. అటునిటు చెరియొకరిచేతబట్టుకొన బడునొక తెల్లని గుడ్డయే తెర. తెరకటు నిటు దివిటీలు పట్టబడును తెరవెనుక హంగుదారులు, తిత్తి, మద్దెల, తాళపు జిప్పల వారును, వంతపాటకులు నుందురు. తెర ముందొక దతడే సూత్రధారుడై ప్రదర్శనారంభము నందు ప్రార్థనాదికముపచరించుట, కథాసందర్భము వివరించుట, పాత్రలకు వంతపాటకులకు పాటల మొదటి ముక్క లందించుట, పాత్రల అభినయమున కనుకూలముగ తాళమువేయుట నడుమ సంధి వచనములను, వస్తుగతవర్ణనాత్మక ద్విపదలను చదువుట మొదలగు పనులొనర్చును. ఒకొక్కకప్పుడు హాస్యగాడని యొకడు వేరయుండి హాస్యప్రసంగముల నెరపుటతో పాటు సూత్రధారునికి సహాయకుడుగా నుండును. వంతపాటకులు పాత్రలతోపాటు పాడుదురు భామాకలాపము 'బాణీ' కి ప్రచారము కల్గిన నాటినుండి యక్షగానమున సాధారణముగా పాత్రలు తెరలో నుండియే తమ యుదంతము తామే (ప్రదర్శక ప్రముఖుని పృచ్ఛలపై) చెప్పుకొని (ఈ పద్ధతి సామాన్యజనుల బోధశాలిత కనుగుణముగా కల్పితమై యుండును) గుగ్గిలము ప్రోక్షణతో భగ్గుమను దివిటీల వెలుగు చూపర కనులు మిరుమిట్లు గొల్పగా, సూత్రధారునివెంట వంతపాటకులందుకొను ద్రుతగతి ప్రావేశిక ధ్రువతో, హంగుదారుల తాళ మృదంగాదుల హడావుడితో తమ కాలిగజ్జెల గలగలలతో బయల్వెడలి యా యా మేళము సంప్రదాయమును బట్టి సభా నమస్కార సూచకముగా సాభినయముగా నమ్రశిరస్కతయో, కరముకుళనమో, పుష్పాంజలి సమర్పణమో, కావించి కథా ప్రవర్తనలో పాల్గొనుట పరిపాటి. కూచిపూడివారి భామావేష మెంతకు గాని

తెర బయల్పడదు. ఆ సందర్భమున జడవర్ణన యొకటి మిగుల విశిష్టమైనది. అది యొక ప్రబంధమే- 'వేణీప్రబంధము' భామవేష గాడట్లు తెరపై జడవైచుట భరతమునందు తనకు సాటివారు లేరని పందెము చరచుట యట! యక్షగానములలో తెర, ప్రక్కవాటుగా గాక పైనుండి క్రిందు వాటముగా తొలగింపబడును. తెర తొలుగు నంత హంగుదారులును రంగముపై పాత్రపార్శ్వముల నుందురు. సాధారణముగా యక్షగాన ప్రదర్శనలలో పాత్ర నిష్క్రమణము మాత్రము ప్రత్యేకముగా సూచింపబడదు. తన ప్రయోజన భాగ (portion) మై పోవునంత నా పాత్ర వెనుకకు జరిగి వంతపాట కుల నడుమ నిలబడును. అట్టిచో నా పాత్రలు వంతలో పాల్గొను టయు కద్దు. ప్రదర్శన సుమారు జాము రాత్రికి ప్రారంభమై తెల్ల వారులు సాగును. తెల్లవారు సరికెట్లో ప్రదర్శనము తెమల్చుకొని మంగళము పాడి మేళము వారా వాలకములతోనే యూరి పెద్దల యింటింటికేగి వారి లోగిళ్ళ మఱలనేదో పదాభినయము పట్టి యధో చితసత్కారములంది పోవుదురు ఆంధ్రదేశ యక్షగాన ప్రదర్శకుల కివి సామాన్య లక్షణములు. ఒక్కొకక్కచో నాయా ప్రదేశములందలి ప్రదర్శకుల కౌశలమును బట్టియు నవకాశములను బట్టియు నభిరుచి భేదమును బట్టియు గొన్ని కొన్ని విశేషములు విపర్యాసములు నుండవచ్చును.

ఇక్కడ నాంధ్రదేశ యక్షగానములందు స్త్రీ పాత్ర నిర్వహ ణము గూర్చి యొకమాట చెప్పవలసియున్నది. 16 వ శ. మొదట తప్పిదారి యొక్క తాయికొండ నాటకమున మాత్రము స్త్రీ పాత్ర లొక స్త్రీయే నిర్వహించినట్లు తెలియుచున్నది. కాని 18 శ. చివరి వనుక స్త్రీ పాత్రలను పురుషులే నిర్వహించినట్లు తెలియనగును. ఆ తాయికొండ నాటకమైనను యక్షగానమని యూహింపనవకాశము గానరాదు. అదియొక వీధి నాటకమైయుండును. పోని, నాటి వీధి

నాటకములందయిన నన్నిట స్త్రీలు పాల్గొనుచుండిరా యనగా నట్లు గాదు. ఆ నాడే కూచిపూడి భాగవతులు వీర నరసింహారాయల యెదుట ప్రదర్శించిన నాటకములలో బురుషుడే స్త్రీ పాత్ర ధరించి నట్లు స్పష్టముగా గలదు. వారు గరితల కభినయ విద్య గఱపుదురు. కాని గణికలైనను తమ నాటకములలో బాల్గొననీయరు—అది కూచిపూడి భాగవతుల ముఖ్య సమయములలో నొకటి. వారి 'భామ వేషగాడు' అనుమాటనొకటి తెనుగు దేశమున దఱచు వినిపించు చుండును. భామ వేషమనగా భామా శిరోమణియైన సత్యభామ వేషము. ఆ వేషమే పురుషులచే నిర్వహింపబడినప్పుడు కడమ స్త్రీ వేషములమాట తడవంబనిలేదు. యక్షగానోప స్థితికి జక్కులపురం ధ్రుల యాటపాటలే కారణములైనను యక్షగానము కూచిపూడి భాగవతులు వీధి నాటక ప్రదర్శకుల దృష్టినాకర్షించి యొక రూపక ప్రక్రియగా బరిణమించినంతట దాని జక్కుల జాతి తోడనే సంబంధము పోయినట్లుతోచును కూచిపూడివారి యాలంబము గల్గినంతట వారి యాచారముద్ర దానిపై హత్తుకొని యిదియే తదితర ప్రదర్శకులకు నాదర్శప్రాయమగుచు వచ్చినది కొంతకాలము. 18 వ శ. నడుమ కూచిమంచి జగ్గకవి చంద్రరేఖా విలాపమున "ఆడు భాగవతుని జాడ గడ్డము మూతి నున్నగా గొరిగించుకొన్నవాడు" అని యన్నమాటను బట్టియు నా కాలముననే తురగా రామకవి యొక చాటువులో భాగోతుల బుచ్చిగానిని స్త్రీపాత్ర ధారిగా బేర్కొనుట బట్టియు నప్పటికి బురుషులే స్త్రీ పాత్ర ధారణము సేయుచుండినట్లు తెలియనగును. కాని 18-19 శతాబ్దుల సంధికాలమున వెలసినట్లూహింపదగిన పురిజాల లక్ష్మీనారాయణ కవి పారిజాత య. గా.న సఖి పాత్ర భాగవతములందు బురుషులు స్త్రీ పాత్రధారణ సేయుటుచితముగాదని వాదించుటయు సత్యభామ ప్రత్యాఖ్యానము జేయుటయు జూడ నా కవి కాలమున నక్కడక్కడ స్త్రీలును య. గా. న ప్రదర్శనములందు బాల్గొనుటకు బూనుచుండిరనియో లేక స్త్రీ పాత్రలు

స్త్రీలచే నిర్వహించుటుచితమను వాదము బయలుదేరి యుండునని యో యూహింపనగును. 19 శ. నుండి యిటనట స్త్రీలును ప్రదర్శనము లలో పాల్గొనుచుండిరనుటకు దగిన యాధారములు గన్పట్టుచున్నవి. విశాఖపట్టణము జిల్లా వృత్తాంత సంగ్రహము (పుట 130)లో "జన రంజక నాటకములు స్త్రీలు పురుషులు వేషములు వేసికొని వినికి చేసెడివారు" అని యున్నది 19 శ. ఉ. భా.న నెల్లూరు మండలము ఆత్మకూరు తాలూకా పడకండ్ల గ్రామ కరణమగు పడకండ్ల స్వామి రాయకవి నట మేళములను రప్పించి నెలల తరబడి వారికి వాసగ్రాస ములు గల్పించి, గణియములు, వస్త్రములు ప్రదర్శన శిక్షణయునిచ్చి తన రచించిన లక్షణా పరిణయాది యక్షగానములను ప్రదర్శింప జేసెడి వాడనియు నా మేళములో "గొనుదిన్నె బుగ్గసాని"యను నామె కవి యాజ్ఞపై నాయక వేషము గట్టినట్లును బుగ్గసాని (లక్షణ) మాటగా నా లక్షణా పరిణయ గ్రంధమందే యున్నది. ఇట్టి సందర్భ ములను బట్టి రానురాను యక్షగాన ప్రదర్శనములందు గొన్నిగొన్ని చోటుల వారికిని బాల్గొనుట కవకాశము గల్గినదని చెప్పనగును.

ఇక నీ యక్షగాన ప్రదర్శన ప్రక్రియ యందలి మౌలికమైన తత్త్వము యొక్క లక్షణము లెట్టివనగా.

1. ఇందు రూపారోపము (పాత్రానుకూల వేషధారణము) గలదు. కావున నిదిరూపక సమాఖ్యకు దగియున్నది. ("రూపారో పాద్రూపకమ్)".

2. ఇందు రసాశ్రయమైన యితివృత్తము, చతుర్విధాభినయ ఆంగిక వాచికాహార్య సాత్త్విక విశిష్టమైన యవస్థానుకృతియు గలవు. కావున నిది నాట్యోపేతమైనది-"(అవస్థాను కృతిర్నాట్యమ్" "చతుర్ధాభినయోపేతం నాట్యముక్తం మనీషిభిః నాట్యం రసా శ్రయమ్)".

3. ఈ యక్షగాన నాట్యము నృత్త నృత్యాను ప్రాణితమైన దని యెరిగిన పెద్దలెల్లరు చెప్పుదురు. (నృత్తం తాళలయాశ్రయమ్, భావాశ్రయం నృత్యమ్)".

ఇట్లు నృత్త నృత్య నాట్యాత్మకమైన యక్షగానముపై నిటీవలి కాలమున మార్గరూపకము ఆధునిక రంగస్థల నాటకముల ప్రభావము పడినను దాని ప్రాక్తనమైన ప్రదర్శన ఫక్కిక యొక్క వ్యక్తిత్వము, నంతకంటె ప్రాక్తనమైనదాని జీవ లక్షణము అగు గానకళా ప్రాముఖ్యమును సంరక్షింపబడుచునే వచ్చినవి. నాటక నామ వ్యవహృతమైనను నీ యిరువది శతాబ్దియందును యక్షగాన శబ్దము విస్మృతము గాలేదు. మార్గాధునిక నాటకములు యక్షగానమువలె నృత్త నృత్య గాన ప్రధానములుగావు. నృత్త నృత్య ప్రాధాన్యసాదృశ్యము కారణముగా మన పండితులు కొందరు యక్షగానము పాశ్చాత్య దేశములందలి "ఒపెరా" వంటిదని యభిప్రాయపడి యున్నారు. కాని ఒపెరాలు గాన కేవలములైనవి. యక్షగానములుగాన ప్రధానములేకాని, గాన కేవలములుగావు. అందు గేయ ప్రయోజనమునకేగాక సాధారణ పఠనోద్దిష్టములైన గద్య పద్యములుండును. అదిగాక యక్షగానములందు ప్రయుక్తమగు నృత్త నృత్యముల తీరువేరు అది కూచిపూడి భాగవతులవంటి శిష్టులచేతిలో నిబిడతర శాస్త్రప్రక్రియానికషాయితమైనది; విశిష్ట సంప్రదాయ చోదితమైనదియును.

అసలు యక్షగాన నాట్యము భరతశాస్త్ర సంప్రదాయానుసారము నృత్త నృత్యాను ప్రాణితమగుటకు, యక్షగానము వీధి నాటకము నేకమగుటకును గూచిపూడి భాగవతులే కారకులై యుందురేమోయనికూడ ననిపించును. యక్షగానము రూపక ప్రక్రియగా రూపొందిన నాటికాంధ్ర దేశమున కూచిపూడి భాగవతులు భరత విద్యా దురంధరులుగా విశేషప్రసిద్ధిగాంచినారు. దేశాటనము సేయుచు నాటక ప్రదర్శనములిచ్చుట వారి వృత్తి. వారు రాజ సన్మానములు

గూడ గాంచినవారు. (ఈ విషయము పూర్వోక్తము) ఏ సుముహూర్తమునందో యక్షగానము వారిదృష్టి నాకర్షించియుండును. తోడనే వారు తమ వీధి నాటక ప్రదర్శనానుభవమును, భరత విద్యా విదగ్ధతనుబట్టి దానినొక విశిష్టరూపక ప్రక్రియగా తీర్చిదిద్దుటకు కృషి చేసియుందురు. ఈ యూహ కుపాధి సిద్ధేంద్రయోగి భామాకలాపము సృష్టి. అదికాక యక్షగానములు ప్రదర్శించుటయందును వారు ప్రసిద్ధులు. వారు ప్రదర్శించువానిలో ప్రసిద్ధములైనవి ప్రహ్లాద, ఉషాపరిణయము, శశిరేఖాపరిణయము, రామనాటకము, హరిశ్చంద్ర, నలచరిత్రము మొ॥ అందు కొన్ని నాటకములు వ్యవహరింపబడినను నవియక్షగాన ప్రాయములైనవే. సాధారణముగా వారి ప్రదర్శనములన్నియు నందు ప్రత్యేకముగా వారి భామాకలాపమును భరతవిద్యా నవద్య ప్రమాణ పటిష్ఠములైనవను సంగతి ఆంధ్ర లోకమంతయు నెరింగినదే. వారి భామాకలాపమేకాగ్రముగా నెనిదిమిది ప్రదర్శనల కుద్దిష్టమైనదట. కూచిపూడి ప్రదర్శనములన్నిట దీని కెక్కువ ప్రచారము. దీని "బాణీని బట్టి" ఆంధ్రదేశమున వివిధ ప్రదేశములలో నెన్నో భామకలాపములు వెలసినవి. "ఆ బాణీ"తో యక్షగానములునసేకము వెలసినవి. అయితే ఆదిని యక్షగాన రచనా ప్రక్రియయే భామాకలాపమునకు మూదల. అనగా సిద్ధేంద్రునికి (17 శ. మధ్య కాలము)నుుందే కూచిపూడివారు యక్షగాన ప్రదర్శనకు పూనుకొని యుందురను నూహకు గొంత యవకాశము గలదు. (అప్పటికే యక్షగాన రచన బాగుగా సాగుచుండినదిగదా.) 16 శ. ఆరంభమునకేవారు నాట్యకళా ప్రచారకులుగా ప్రసిద్ధులుకదా రంగ విషయముునను, హంగు విషయమునను గూచిపూడివారి ప్రత్యేకత యంతపోయినను బహువిధాభరణములు, కరాళములు (Masks నృసింహాది పాత్రలకు) గలవారి "సరంజాము" దొడ్డది. వారి ప్రదర్శనప్రక్రియ సరేసరి. ఆంధ్రదేశ వివిధ ప్రాంత యక్షగాన ప్రదర్శకులకు వారి ప్రదర్శన పద్ధతులే యాదర్శప్రాయములైనను

ఏనాదులు, గొల్లలు మొదలగు తక్కువ తరగతి ప్రదర్శకులు బయలు దేరుటవలన కూచిపూడి కత్తునందలి లగువుబిగువులు వారియెడ నంత కానరావు. కూచిపూడి భాగవతులు నూరూర మేళములుగ బర్య టించుచుండుటవలన నాయా వూళ్ళలోను కొన్ని మేళములు మొలిచినవి. సిద్ధేంద్రయోగి మేళము, భాగవతుల దశరథరామయ్యా గారి మేళము. 18 శ. న భాగోతుల బుచ్చిగాని మేళము, 19 శ న రాయలసీమలో లేపాక్షి, వేములపల్లి, తాడిపత్రి మేళములు, 19-20శ.ల సంధికాలమున నెల్లూరు మండలమున పడకండ్లస్వామి గాయకవి, త్వరకవి రామకృష్ణయగారల మేళములు, విశాఖమండ లమున నరసింగపల్లి, కళ్లేపల్లి కందాళ చిదంబరకవి మేళములు, పల్నాటిసీమ మేళములు మున్నగునివి కొన్ని ప్రసిద్ధికెక్కినవి. కాని యొకనాడాంధ్రుల నాట్యకళా ప్రతిష్ఠలకధిష్ఠానమైన కూచిపూడి లోనే యీనాడా భాగవతులకు గతులులేకుండా బోయినవనగా నిక గడమ యెడల యక్షగాన ప్రదర్శన మేస్థితిలో నున్నదో తడవంబనిలేదు.

17 వ శతాబ్ది ప్రథమ పాదముననే తంజావూరులో యక్షగాన మునకు రాజాశ్రయము లభించి రంగభోగము విస్తరిల్లినది. రఘు నాథ విజయరాఘవ నాయకుల కాలమున నగరి పెత్తనము క్రింద నాటకశాలలు వెలసిన జాడదోచుచున్నది. ఆ రాజులు స్వయముగ యక్షగాన రచన గావించిరి. విజయరాఘవాస్థానమున దానికింకను ప్రోత్సాహము కలిగి యిది వీధి నాటక వైఖరితో రంగమున కెక్కి నది. విజయరాఘవుని పూతినాహరణము, ప్రహ్లాద చరిత్ర మొ॥ కృతులలో రంగప్రయోగ సూచనలనేకము గలవు. (అవి ముందటి ప్రకరణమున సుదాహృతములు). ప్రహ్లాద చరిత్రమున 'నాటక శాల' 'విదూషక' ప్రశంసలు గలవు ఇది (ఫలానా) 'పాత్ర వాక్య' మని కలదు. చివర నిందలి పాత్ర వివరములును గలవు. దీనిని బట్టి నాడు యక్షగానము రంగమున కెక్కెననుట విస్పష్టము. కాని యా

రంగరచన తీరెట్టిదియో తేటపడులేదు. భరతవిద్యా దురంధరులైన నాయకరాజుల నగరినాటక శాలలందైన రంగరచన భరతశాస్త్రోక్తముగ జరిగియుండునని యూహింప నగును. తదుపరి మహారాష్ట్ర ప్రభువులకాలమున తంజావూరిలో యక్షగానముపై మార్గనాటక ప్రభావము కూడ బాగుగా బడియుండుటచే (ఈ విషయము బూర్వోక్తము) నాడును యక్షగాన రంగము రాజాస్థానమునందైన శాస్త్రోక్తముగనే తీర్పబడి యుండుననుకొనవచ్చును. కాని యా మహారాష్ట్రుల నాటక గ్రంథములలో సూత్రధారుడు భాగవతులను పాత్రలను బలుకరించినట్లుండుట చూడ నా ప్రదర్శన తీరు కొంత వర కాంధ్రయక్షగానములను బోలినదనియు చెప్పనగును. అందుగణపతి సరస్వతుల స్తుతులతో పాటు పాత్రప్రవేశములును చెప్పబడియుండుట మహారాష్ట్రదేశపు 'లలిత'. నాటకఫక్కి. చివరి మహారాష్ట్ర ప్రభువగు శివాజీ కొలువున భాగవత మేళములుండినట్లు స్పష్టముగా దెలిసినది. (పూర్వోక్తము) ఆయా యాధారములవలన నాడునాయక మహారాష్ట్ర రాజాస్థానములందు నాటకశాలలు, భాగవత మేళములు విలసిల్లినట్లును భరతవిద్యా ప్రియంభావకులగు నా ప్రభువుల ప్రోత్సాహమున యక్షగాన రంగరచన, ప్రదర్శన భంగి గొంతవైన భరతశాస్త్ర విధానసంవాదిగా నేర్పడి యుండునని నూహింపనగును.

17-18 శతాబ్దులలో తంజావూరులోను, మధుర మైసూరు రాజాస్థానములందును యక్షగాన ప్రదర్శనలలో స్త్రీలును బాల్గొనుచుండినట్లాధారములు కన్పట్టుచున్నవి. తంజావూరి రఘునాథుడు 'రంగస్థలంబు రామాలంకృతంబు చేసి' నాడు. (చూ. విజయ విలాసము. అవతారిక) విజయరాఘవాస్థానమున యక్షగానమును గొందరతివలు వినిపించుచుండెడివారని చెంగల్వకాళకవి చెప్పినాడు. (చూ. రాజగోపాలవిలాసము. అవతారిక) వినిపించుట యనగా సంగీత గోష్ఠి యనియేకాక ప్రదర్శించుట యనియు నూహించుట కవకాశం

కలదు. విజయరాఘవాదుల యక్షగాన నాటక ప్రరోచన సర్వ సాధారణముగ 'పరాకు స్వామివారు హావణించిన...... నాటకంబు నటన పటిమ గనుపించ వినుపించేము: విన నవధరించుచుండ' అని యుండును. అందుచే కాళకవి వక్కాణలో నటన పటిమగతార్థమైన దనియే భావింపనగును. అదియుగాక విజయరాఘవ నాయకమైన విజయరాఘవ చంద్రికా విహారమున నాయనివారి "బైటి నాటకశాల పడుచు" నాయికయైన దనగా నిక నొక నట్టువకత్తె యా వాలకం వేసి దాటకమున బాల్గొనుట కథ్యంతరముండునా నాయనివారి కొలువులో! మైసూరు కంఠీరవ మహారాజు కొలువునను దదుపజ్ఞములగు యక్షగాన ప్రాయ రచనలు పదకేళికలవలె నట్టువరాండ్రచే ప్రవర్తింపబడి యుండునను నూహకుగల సామంజస్యమిదివరకే పరిశీలింపబడినది. మధుర విజయరంగ చొక్కనాథ "సభార్హాముగా" వెలసిన తిరుమలకవి తిల్లగోవిందరాజ నాటకమును "ఉదుటువగ కోపుల వైపులమర...ఇంచుబోణులు నటించు"వారని యందేకలదు. ఆ యాధారములను బట్టి నాడు దక్షిణదేశ రాజాస్థానములందు యక్షగాన ప్రదర్శనలలో స్త్రీలును భాల్గొనుచుండిరని చెప్పవచ్చును. ఇది 17-19 శతాబ్దులముచ్చట. కాని 19 శ. పూ. భా. తంజావూరు శివాజీనగరి భాగవత మేళము "సబనీసు" దగ్గర నుండిన శివాజీ అన్నపూర్ణా పరిణయ నాటకము "వేషాలనావనీసు"ను (తం. స. మ. నం. 622) గాని తం. స. మ. కే. నం. 799 "నాటక పాత్రలు" అను పట్టికలనుగాని పరిశీలించినచో నొక్కయపవాదమైన లేకుండా నన్ని స్త్రీ పాత్రల నెదుటను పురుషనామములే కనవ్పట్టును. అనగా నానాడు పురుషులే స్త్రీ పాత్రలను ధరించుచుండిరనుట స్పష్టము. దీనికి కారణము 18 శ. చివర తంజావూరికి మిక్కిలి సమీపముననున్న మెలట్టూరున వెలసిన భాగవత మేళ నాటకముల సంప్రదాయము కావచ్చును. అవి నాటి తంజావూరు రాజస్థాన నాటకములవలె

యక్షగాన ప్రాయములైనవే యయ్యు కూచిపూడి వారి ప్రదర్శనల వలె నొకగొప్ప విశిష్ట సంప్రదాయ పటిష్ఠమైన ప్రక్రియగలట్టివి. (ప్రత్యేకముగా వీని గురించి వివరములకు చూ. నా ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర పుట. 190-95).

## ఉ ప సం హా ర ము

సర్వోపభోగ్యమైన సమాహార కళాస్వరూపమై, వివిధ ప్రక్రియాను బంధబంధురమై, బహువిధ పదకవితల పాలవెల్లియై, అతి మాత్ర వస్తు రసచ్ఛందో భాషావైవిధ్య భాసురమై, భిన్నదేశ భిన్న కాల కమ్యాపన్నమై అనేక లోకవృత్త విశేష ప్రదర్శకమై ఆంధ్ర జాతీయ రూపక కళాసర్వస్వతి ప్రతినిధియై అన్యభాషీయులకు అనుకార్యమై యావదాంధ్ర వాఙ్మయమున బహుముఖ వైవిధ్యము, వైశిష్ట్యము కలిగి విశాల సారస్వత శాఖగా విలసిల్లిన ప్రక్రియ యక్షగాన మొక్కటే.—

**గమనిక** :—ఇంకను వివరములకు, విశేషములకు, ఆధారములకు, ఆకరములకు నా "ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర" అను గ్రంథము చూడదగును.

ప్రచురణ : ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, వాల్తేరు.